ఘోరరణము సలిపి, యెట్టకేలకు పరాజితురాలాయెను. బలవంతముగ యుద్ధమం దోడించి మహబత్ఖాను నణచుటకు శక్తిలేదాయెను. ఇకమిగిలిన దామెకు జన్మతః సిద్ధించిన యుక్తి. తనంతదానె, భర్తను విడచి జీవింప జాల ననియు భర్తతోగూడ దానును బందీకృతయై యుండెదననియు, మహబత్ఖాను హస్తముల జిక్కెను. విరోధి శిబిరముజొచ్చినంతనే మహబత్ఖానుని సైన్యమందలి రసపుత్రులకును, మహమ్మదీయులకును వైరము గల్పించి, మహమ్మదీయసైనికు లందరను దనవంకకు ద్రిప్పికొని, మహబత్ఖానును బంధించుట కొక తంత్రమును బన్నెను. ఈ రహస్యము నంతయు నెరింగి మహబత్ఖాను ప్రాణావశిష్టుడై పలాయను డాయెను. ఇంతకుమున్నె పార్వేజు మరణించెను. అందుచే నూర్జహాను నోడించి షహరియారును రాజ్యమునకు రానీయకుండ జేయుటకై ఖుర్రము గొప్పప్రయత్న మొనరింపబూనెను. అప్పుడు నూర్జహాను మరల మహబత్ఖానుని బిలువనంపి యెట్లో యాతని మోసగించి, యాతడు ఖుర్రము నోడించుటకును సర్వసైన్యాధిపత్యము నాతని కిచ్చుటకును మరతుల నేర్పరచుకొని సంధి కుదుర్చుకొనెను. అట్లే మహబత్ఖాను సైన్యసమేతుడై ఖుర్రము నోడించుటకై వెడలుచుండ, 1627 వ సం॥ మున అక్టోబరు 28 వ తేదీని జహంగీరు మరణించినట్లు మార్గమధ్యమున నాతనికి దెలియవచ్చెను. ఇంతలో మొదటినుండియు దనకు విరోధియు, ఖుర్రము శ్వశురుడునగు అసఫ్ఖానుని గలసికొని, యొండొరులు సఖ్యపడి, ఖుర్రమును, షహజహాన్ బిరుదముతో సింహాసన మెక్కించిరి. ఈవిషయము నంతయు చారుల మూలమున నెఱింగి, నూర్జహాను, తన యధికార మిక సాగదని గ్రహించి, సర్వసంగపరిత్యాగ మొనర్చి, రాజ్యకాంక్ష లేక, యంతఃపురమున నేకాంతయొక మూల సన్న్యాసినివలె, భర్తృనామస్మరణముతో దనజీవితమును గడపుచు 1646 వ సం॥ మున గాలధర్మము నొందెను.

జహంగీరు, సింహాసన మధిష్ఠింపకమున్నె, మరభ్యాసములకు లోనై, తన్నతిగారాబముతో బెంచిన తనతండ్రి మనస్సును జాల నొప్పించెను. తాను రాజ్యాధిపత్యము వహించిన రెండుసంవత్సరముల లోనే ప్రజలు కొంచ మాతని పరిపాలనవిధానమున కసంతృప్తి నొంది ఖుస్రూను రాజుగ నొనరించుటకై యల్లరులుచేయ మొదలిడిరి. సింహాసన మధిష్ఠించునప్పటికే, "తెలివిగల త్రాగుబోతు" అను బిరుదముచే బ్రఖ్యాతివడసిన జహంగీరే స్వయముగ దన జీవితాంతమువరకు రాజ్యపాలన మొనర్చియుండినచో మొఘలుల వంశచరిత్ర యెట్లు పరిణమించి యుండెడిదో, దురూహ్యము. అట్టి విపత్తున బడకుండ, రాజ్యక్షయము లేకుండ, దేశమందు శాంతిని నెలకొల్పి ప్రజల రక్షించుటకవతరించిన దేవతవోలె నూర్జహాను సకలరాజ్యభారము దనపై వైచుకొని జనానురంజకముగ బాలించెను. ఎట్టిప్రతిభాశాలి కామన్న సకలభారతభూమి నేలు చక్రవర్తి నొకనిని దన పాదాక్రాంతునిగ జేసుకొని, రాజ్యభారమంతయు వనకు విడచునట్లుచేసి, దేశమును మహావిపత్తునుండి తప్పించెనో చదువరులే యూహింతురుగాక! ఇక నట్టి శక్తిమతి రాజ్యమందుగూడ నెందులకు దిరుగుబాట్లు, నల్లరులు గలిగెనని ప్రశ్నింపవచ్చును. జహంగీరు మరణసమయమున గలిగిన యల్లకల్లోలములు, నూర్జహానే కాక, మరి యే యితరచక్రవర్తి (యెంత ప్రఖ్యాతుడైనను) యధికారమందున్ననుగూడ సంభవింపక తప్పదు. కాని యాయల్లకల్లోలముల నల్ల సామ్రాజ్యమును సంక్షోభపరచకు గడుంగడు శక్తిసామర్థ్యములతో నణచిన ప్రఖ్యాతి నూర్జహాను నెన్నడును విడువదు. నూర్జహానే రాజ్యభారము వహింపకున్నచో మొఘలువంశచరిత్ర యెట్లు మారియుండెడిదో కదా! ఎన్నియుద్ధములు జరిగినను, నెన్ని తిరుగుబాట్లు సంభవించినను, ప్రజల క్షేమమాత్రము నష్టము రానీయకుండ రాజ్యపాలన మొనర్చుటయందు నూర్జహాను చూపిన ప్రజ్ఞావిశేష మత్యధికశ్లాఘనీయము. ఏది యెట్లున్నను జహంగీరే స్వయముగ రాజ్యభారము వహించినచో రాజ్యము క్షీణించెడి దనుమాట మాత్రము రూఢి.

కాని యంతమాత్రమున నూర్జహానొక స్త్రీరూపము దాల్చిన పురుషునిగనో, మానవరూపము దాల్చిన రక్కసిగనో తలచుట కవకాశము లేదు. నూర్జహానుగూడ నితరులవలెనే యొక సామాన్యస్త్రీ. స్త్రీ సహజమగు ప్రేమ యామెకుబుట్టినిల్లు. దయాధర్మములు రెండు నీమెకు హస్తములు. ఈమె నిర్భాగ్యుల పాలిటి కల్పతరువు. రణనీతివిశారద. అస్త్రప్రాంశిత్యచతుర. సకలవిద్యాప్రవీణ. రాజ్యతంత్రజ్ఞానకుశల. కాని, యిట్టి యత్యద్భుతసద్గుణముల కాలవాలమగు నూర్జహానుకూడ స్త్రీసహజమగు నధికారవాంఛ, యాత్మశ్లాఘ, యసూయ మొదలగు హీనగుణములకు బానిసయై యుండెను. అంతమాత్రమున నామె జీవితము నా నీచగుణములు, హీనముగ నొనరింపజాలవు. సర్వకాలము నామె యొనర్చిన సత్కార్యము లితరలోటుబాట్లను గప్పిపుచ్చును. ఆమె సద్గుణరాశియం దామె లోటుబాట్లు ప్రత్యేకించి యెన్నదగినంతటివి కావు.

నూర్జహాను జీవితము నంతయు సావధానముగ బరిశీలింపగా స్త్రీలుగూడ రాజ్యపాలనకు వలయు సామర్థ్యము గలవారనియు, గొన్ని సమయములందు బురుషులకు మించిన కార్యములగూడ నొనరింపగలరనియు స్పష్టమగుచున్నది. ఒకవంక సవతికుమారునివలన గలుగు బాధల సవరించుకొనుచు, మరియొకవంక సామంతుల తిరుగుబాటుల నడగించుచు, భర్తమనస్సు నొవ్వకుండ, రాజ్యవినాశనము లేకుండ, యుక్తియుక్తముగ బ్రజలకు గష్టములు రానీకుండ రాజ్యమేలి యెల్లర మెప్పువడసిన ప్రతిభాశాలి, నూర్జహాను. ఆయత్యద్భుతసాహసము, మనఃస్థైర్యము, కార్యాచరణాసైపుణ్యము, కార్యదీక్ష, సూక్ష్మబుద్ధి, రాజ్యపాలనచాతుర్యము, సకలకళాప్రావీణ్యము, ఆ గాఢప్రణయము, నమోఘమగు పతిభక్తి, దీనజనరక్షణ, పరమకారుణ్యబుద్ధి, యాదిగాగల సర్వశుభలక్షణములు నూర్జహానను నొక్కనామమున నిరంతరమును ధ్వనించుచుండును గదా!



ఆదిఆంధ్రీయమహాజనసభ, బెంగుళూరు



శ్రీ రాయప్రోలు సత్యనారాయణగారు



శ్రీ తుంగల రామారావుగారు



శ్రీ నాగుల్కొండ వెంకటాచలంగారు



శ్రీ కేపాక వెంకటరత్నంగారు



శ్రీ కందాడై భాష్యాచార్యులుగారు



శ్రీ పెండెం అప్పలస్వామిగారు

గడుపుచుండినను రామభజనము, నతిథ్యభ్యాగతులసేవ, యాంధ్రకవితారాధనము మాత్ర మేమరకుండెను. అట్టులెన్ని దినములో జరుగలేదు. దాస్యము స్వాతంత్ర్యము నడంచునుగదా. రామసేవ కుద్యోగధర్మ మంతరాయ మగుచుఁ దృణంబుంబోలె దాని విసర్జించి సమర్థుఁడగు గురువునొద్దఁ దారకమంత్రమును గైకొని తనయింట రామమందిరమును నిర్మించి సీతారామాదివిగ్రహముల నిల్పి నిత్యము భజించుచు, నిరంతరము గద్యపద్యాదులచేఁ బొగడుచు నెన్నియోని శతకంబుల గేయంబుల రచించి ప్రసిద్ధుఁడై యుండెను.

౨

అన్నదానంబు పునర్జన్మహేతువని వాదించు లోభులకును, నాచారశూన్యులై "అహం బ్రహ్మాస్మి" యని వాదించు దాంభికులకును, కుపథగాములై పుణ్యపాపంబు లాత్మ కంటవను పండితమ్మన్యులకును చెప్పఁజాలముగాని ముక్తికి భక్తియు భక్తికిఁ దీర్థసేవయుఁ గారణములు గాకపోవు. తా మెందుం గొఱగాక భక్తులం జూచి యోగుల మాత్రము పొగడియు యోగులంజూచి జ్ఞానుల నేకొండాడియుఁ దదితరుల దూషించువారు తీర్థయాత్రాపరుల గేలిసేయుదు రేటు? శివశర్మాదులు తీర్థయాత్రలఁ గృతార్థులు గాలేదా? నేఁడు ధూమశకటాదులవలన సుదూరమ్మైనను దాపగుచున్నది కాని పూర్వము కాశికేగుట కాటికేగుట సమానమఁట. రైళ్ళలోఁ గూరుచుండి యనాయాసముగా యాత్రల సేవించిన ఫల మొకవేళ నంత లేకుండునేమో కాని కాలినడకతో వివిధ శ్రమల కోర్చి కష్టసుఖంబుల ననుభవించి యనేక గ్రామప్రజల యన్యభాషాసల్లాపసంభాషణాదుల నాలకించుచుఁ జేయు యాత్ర భూతదయను లోకజ్ఞానమును సౌభ్రాత్రమును భక్తిని బెంపొందింపఁ జేయకపోదు. ఫలము గల్గకపోదు. అట్లగుటవలననే కాఁబోలు యాత్రసల్పి వచ్చినవారిని స్వపౌరులు మేళతాళంబుల నెదుర్కొని మహావైభవంబున నింటికి గొంపోయెదరు.

సీ. పాడిదగ్గు కంఠంబుఁ బొరివుచ్చకయమున్న
తల ప్రకంపంబుఁ బొందకయమున్న
బొమలు కన్నులమీఁదఁ బొదలి వ్రాలకమున్న
పొగ నేత్రముల కడ్డు వోరకమున్న
శ్రుతిపుటంబుల శక్తి సురిఁగిపోవకమున్న
వళు లాననమునఁ బర్వకయమున్న
హృదయంబులో జాగ పదను దప్పకమున్న
గాత్రంబు శిథిలంబుగాకమున్న
పండ్లు వేర్వ్యాసి కదలు చూపకయమున్న
కాకి కడకంటిపై చూపు రాకమున్న
కాలు నే యాడు తజియుండ కదలవలయుఁ
దీర్థసేవకు దేహ మస్థిరముగాన. (కాశీ)

అని తలపోసి మనదాసుగారు క్రీ. శ. 1818-19కి సరియగు బహుధాన్య సంవత్సర కార్తికమున శ్రీరంగమున కేగి రంగనిం గడు సుప్రాంగుచు సేవించి "శ్రీరంగశాయి తారహారము" అను మకుటము గల సీసపద్యముల నిర్వదేఁడింటిని సమర్పించి తిరిగి యిలుసేరెను. వీ రే దేవు నెప్పుడు దర్శించినను బద్యములతోఁ బొగడక మగిడిరాలేదు.

## కాశీయాత్ర క్రీ. శ. 1820-21

తన మాతృదేవత యగు వేంకమాంబను, నర్ధాంగియగు లక్ష్మీబాయమ్మను సోదరుఁడగు కృష్ణదాసును నుచితవాక్యముల సమాధానపఱిచి విక్రమ సం॥ చైత్ర శు ౧ శనివారము రేవతీనక్షత్రమున గుంటూరునుండి కతిపయాప్తమిత్రులతోఁ గదలి యమరావతి కేగి కృష్ణాస్నానమునఁ బవిత్రుఁడై భర్గం గొనియాడి దుర్గమారణ్యమార్గముల ననర్గళ భక్తిపరవశుఁడై నడచుచుఁ గ్రమముగా భద్రాద్రి కేగ శ్రీరామచంద్ర మూర్తిని దర్శించి

సీ. అర్థి కిచ్చినధనం బపుడే మఱచె దట
పదిల మోహో రామ! బహుపరాకు
అపకార మొనరించు నతని మఱచెదట
పదిల మోహో రామ! బహుపరాకు
మఱచుట నీ కింత మతి సహజంబట
పదిల మోహో రామ బహుపరాకు
మహి నున్న నీగతి (?) మఱచెద వేమొకో
పదిల మోహో రామ బహుపరాకు
పద్మజాతు! రమాధీశ! బహుపరాకు
భక్తనరసింహపోషక! బహుపరాకు
భద్రశైలా! పరిస్థిత బహుపరాకు
భక్తమందార రఘువీర బహుపరాకు.

ఇట్టి యనేకపద్యంబులఁ బరాకు దెలిపి మఱలఁ బయనంబై దినక్రమంబున నశ్వారావుపేట, కొవ్వూరు, రాజమహేంద్రవరము, నావలఁ బిఠాపురముం జేరి కుంతిమాధవుఁ బూజించి సింహాద్రి కేగ వరాహనృసింహస్వామికి మ్రొక్కి కూర్మపురముఁ జేరి ...లీశ్వరుని భావించి జగన్నాథముఁ దొరసి మార్కండేయాదిపుణ్యతీర్థంబులఁ గ్రుంకి జగన్నాథుని బిల్వమహిమకథల వినుచు నాతనికి నమస్కరించి

పంచ.— పరాకు శ్రీరమాంగనాస్య పద్మపద్మబాంధవా
పరా కనంతపద్మజాండ భారపూరితోదరా
పరాకు భక్తహృన్నివాస భవ్యదివ్యవిగ్రహా
పరాకు దేవమౌళిరత్న భాసితాంఘ్రిపంకజా.

అని పొగడి యందు పంచరాత్రంబులు వసించి యటుగదలి బహుకష్ట ప్రయాణంబుల జాజిపురంజేగి యన్నదిని పైతృకక్రియల నిర్వర్తించి మార్గశీర్షమ్మున నలసి కాశీదర్శనభాగ్య మున్నదో లేదో యని చింతించి రేయి యగుడు నిద్రింప స్వప్నంబయ్యెనఁట.

సీ. బ్రహ్మాదులకునైన బసయ సాధ్యముకాని
యప్రతిహతశక్తివైన నీవు
దురితాత్ముఁడంచు నన్ ద్రోయఁగాఁ జూడక
యతిదీనుఁ డీశేఁడం చాత్మ నెఱింగి

జాలిజనించి కాంచోలు నాపైని నీ
నిర్హేతుక ప్రేమ నెగడఁజేసి
స్వప్నగోచరుఁడవై భవమెల్ల తీర్చి తీ
మేలు నా కరయ వేవేలుగాదె
ప్రాంతమున నాదుపట్ల నొక్కింతకరుణ
నీకుఁ గల్గిన రేపుఁ ద్రిలోకములను
సాకు సముఁ డుంపఁగలఁడే యనాథ రక్ష
దశరథకుమార రామ భద్రాద్రిధామ!

గీ. వెలుపకు మటంచు నన్నిట్లు వెన్నుఁ జఱచి
దయ దలిర్పంగఁ జెప్పెడి దాత లెవరు?
తల్లి దండ్రులు గురువులు దైవమీవె
దశరథకుమార రామ భద్రాద్రిధామ!

అహా! నృసింహదాసా? ఎంతధన్యుఁడవోయి! శ్రీరామచంద్ర మూర్తి హస్తస్పర్శభాగ్యము నందితివి. పూర్వపు భక్తుల స్వప్నంబు లట్టివి. వారి విశ్వాసంబు నట్టిది. నేనును నావిలికోలను సుబ్బారావుగారు, నప్పాదాసుగారు మొదలగువారికి స్వప్నసాక్షాత్కారాదికము గలదు. అయినను నట్టివానిని నమ్మక పరిహసించు మూఢులును లేకపోలేదు. ఎవరికి లోటు? కావుననే దాసుగారు

గీ. శ్రీమజంబని కొందఱు పెద్దలెల్ల
నన్ను నిందింతురా తప్పు నాదికాదు
దాసుఁ డనుపేరుఁ బెట్టించి ధరణియందుఁ
ద్రిప్పి రక్షించు దీక్షకా దేవదేవ.

అనియు నంత నిలువక,

గీ. మించి జనములెల్ల మెచ్చుకొలుపు వ
ర్తింపఁజాల లయకు సొంపుమీర
నెసఁగి పాపసేర నిల నప్రపయోజక
తనువు డీనిఁ ద్రోచు దాత వీవె.

క. హరి నీ యడుగుందమ్ముల
నరపి మదిం గంటి నింక నరివర్గము శ్రీ
జెలువను జామి.........................

అని నమస్కరించి పొగడి పాదచారియై క్రమముగా బుద్ధగయ కేగి ఫల్గుణీనది దర్శించి స్నానసంధ్యాదులను పైతృకవిధులను నిర్వర్తించి యందందుంగల పుణ్యతీర్థముల మెట్టుచు రామనామస్మరణము పలుపుచుం జని చని దూరంబునం గాశిం గని

సీ. రజతాద్రి యిచటికి రాఁబోలునేమొకో
కాదు కాశీసౌధకాంతిగాని
... ... ... ... ... ...
... ... ... ... ... ...

అని వర్ణించుచు సంతోషాతిశయమున నృత్యముసేయుచు,

గీ. పాంచభౌతిక దేహంబుఁ బాసి జీవుఁ
డరుగునప్పుడు సవ్యకర్ణాంతరమునఁ
తారకబ్రహ్మమంత్రంబు దయ నొసంగు
హరుని కాఁపురమగు కాశి నరయఁగంటి.

అని యుప్పొంగి దరియంజని హృదయపీఠి విశ్వేశ్వరు నిలిపి భావకుసుమంబులఁ బూజించి జాహ్నవీ విమలతోయావగాహనంబునఁ బవిత్ర దేహుండై యవ్వలిపురి నొక భూసురావాసమున నతనియింట వసించి భక్తితాత్పర్యవిశేషంబుల నిత్యము విశ్వనాథుని సేవించుచు బిందుమాధవు భావించుచు భవానిని సన్నుతించుచు దండపాణిని విమర్శించుచుఁ దుండిని గొల్చుచు భైరవుని బిల్చుచుఁ గ్రమక్రమముగా నర్వదినాలుగు ఘట్టముల నధిక శ్రద్ధఁ బరిశీలించి పవిత్రుండై కృతార్థుఁడనైతినని హర్షించి పితృతర్పణాదులొనరించి విడువలేక విడువలేక యగస్త్యునింబోలెఁ గాశి విడిచి పశ్చిమముగాఁ జని ప్రయాగను గాంచి తనయందుంబోలె గంగాయమునాసరస్వతుల నందుం దర్శించి త్రివేణీసంగమంబున స్నానాది కృత్యంబు లాచరించి తక్కుంగల విశేషమ్ము లారసి జన్మమ్ము సఫలమ్మయ్యెనని భావించి దీర్ఘప్రయాణమ్ముల దస్సివనాఁ డునుటచే నటు పైకిఁ జనలేక వెనుకకు మఱలి తన మాచిన మహిమల మనంబునం దలంచుచుఁ గొన్నిదినంబులకు గుంటూరున కేఁగుదెంచి తన తల్లియగు వేంకమాంబ పాదపద్మములపాలి తాఁదెచ్చిన గంగాజలంబుల నామె నభిషేకించి యాత్రాప్రసంగముల నుగ్గడించుచు బంధువులతోఁ గూడఁ గొన్నిదినంబులు గుంటూరున గడపెను.

అంత శ్రీరామకల్యాణ నిరీక్షణ కౌతూహలాయత్త చిత్తుండై తమ్ముఁడగు కృష్ణదాసుం దోడ్కొని బంధువుల వీడ్కొని కనువేడ్కతోఁ గదలి వృషసత్సర చైత్రశుద్ధనవమికి భద్రాద్రిని జేరి గౌతమీ పూతజలంబుల స్నాతుండై శ్రీరామునకు హృదయమిచ్చి సీతాదేవికిఁ గానుకలిచ్చి హనుమకు మ్రొక్కులిచ్చి స్వామిసన్నిధి నిలిచి యంజలిబంధుండై

సీ. గయయందు నిప్పాపి కసురులకు ధరావంఘ్రి
నీక్షింపఁజేసిన దీనకావె?
గంగాపవిత్రతే కలుషాత్మునేతఁ జే
యించి రక్షించిన దీనకావె?
కలయందు నగ్నకాకారివై వీనికి
ధృతి నెసకొల్పిన దీనకావె?
మఱల నిప్పాపి నీ చరణసన్నిధిఁ జేర్చి
యింపుఁగావించిన దీనకావె?
ఇంక దక్షిణదిగ్యాత్ర లెటుల వీని
వలనఁ జేయింపఁగా మదిఁ దలఁచినావో!
భారమెల్లను నీదె దివ్యప్రభావ
దశరథకుమార భద్రాద్రిధామ రామ.

ఈరీతి నా భగవంతుని బొగడి యతని యంఘ్రుల హృదయంబు స్థాపించుకొని మఱల గుంటూరు చేరె.

అంతఁ దనువస్థిరమనియు సత్కార్యాచరణము సేమర రాపవిత్ర నిజజననికిం గళత్రమునకుం బోధించి తమ్మునికి ధైర్యంబుఁ గొల్పి

నుండియు శ్రీరామునిపై భారంబువైచి రామేశ్వరాదిదివ్యక్షేత్రంబుల వీక్షించు తమకంబున ఖరవత్సరాషాఢశు ౨ (క్రీ. శ. 1831-32) దినంబున గుంటూరునుండి నిర్గమించి పొన్నూరుఁజేరి శ్రీభావనారాయణ స్వామిని గీర్తించి బాపట్లకేగి యందలి స్వామిని బొగడి యుబ్బుచు నిట్లు తా విడిసిన ప్రతిస్థలముల నుండు స్వాములను సర్వించి మ్రొక్కుచు ననుదినప్రయాణమ్ముల నెల్లూరికేగి పెన్నలోఁ గ్రుంకులిడి యందలి దివ్యాలయంబుఁ జూచి యచ్చెరువొంది రంగనాథుని సేవించి యాతనిం బొగడి తిరువళ్లిక్కేణి డాసి పార్థసారథి సర్వించి చెన్నపురినుండి కపిలి రొయిడనెడ వర్షంబులఁ దడియుచు గడగడ వడఁకుచు నెండకుఁ గందుచు క్షుత్తృష్ణలకు సోలుచుఁ గాలినడకలకు బడలుచు నొడలు కృశింపఁ బయనములు సేయుచుఁ జిదంబరముఁ గరము మురియుచు సరసి యందలి పుష్కరిణీతీరమునఁగల నానావిధభక్తులఁ బలుకలెసఁగఁ బరికించి గగనలింగముం గని ప్రణమిల్లి బిల్వపత్రంబులం బూజించి శివకాళి కరిగి శంకరునకెఱఁగి గౌరీసుయోగంబునం గాంచి పంచనటము వీక్షించి కావేరిం దర్శించి కాయంబు ముంచి మధ్యార్జునంబున మహేశ్వరు సర్వించి కుంభకోణమున ద్వాదశతీర్థంబులం గ్రుంకి కుంభేశు శంభో హర హరా! యని యర్చించి యచటియుం గల దేవతలను సేవించి పంచనాథమున భవుని భక్తితోఁ బూజించి యందు దాకాలమున నున్న పరమభక్తుండగు శ్రీత్యాగరాయలవారి మహిమముల విని యచ్చెరువంది వారిం దిలకించి వారి సంగీతకీర్తనములఁ దన్మయుండై

సీ. కేవలానందసంకీర్తనావళి వింటి
భావసిద్ధియు శుద్ధభక్తిఁ గంటి
భక్తులు శిష్యులు బలసి కొల్వఁగఁ గంటి
వాఙ్మాధురీవైభవంబుఁ గంటి
వినయసత్సంపద్వివేకముల్ కనుఁగొంటి
శ్రీరామపదభక్తి చెల్వఁ గంటి
నిజాన కందఁగరాని యనుభవంబును గంటిఁ
దన్మయత్వం బాత్మఁ దనరఁ గంటి
సరసి కనుఁగొంటిఁ ద్యాగరాయార్యవరుని
నీ లసద్గుణపుంజ మిం కెన్నిదైన
దివ్యమహిమాతిశయములు దేజరిలుటఁ
గంటి హర్షాబ్ధి నోలాడుచుంటి మదిని.

గీ. రామపదభక్తికి త్యాగరాయవరుని
సములు గానేర రెవ్వ రిక్ష్మాతలమునఁ
బ్రేమ నా ఘను డొకసారి పిలిచెనేని
రాముఁ డోహో యటంచు మార్పలుకునంట.

గీ. అట్టిఘనుని యాజ్ఞ నంది యచ్చోటు వాసి
కడురయంబుతోడఁ గదలిసాగి
పరఁగ రాజిలు నవపాషాణమహిమంబు
నాలకించి ముందు కరిగియరిగి.

తరువాత నవగ్రహశిలలను జక్రతీర్థము సేత్వారంభస్థలము వీక్షించి యచటి క్షారవాదితీర్థముల సర్వకృత్యము లాచరించి శాశ్వతసౌఖ్యప్రదము ననశ్వరమునగు రామేశ్వరము సముత్సుకత నవ్వీక్షించి మహోన్నతంబై విచిత్రశిల్పవిభ్రాజితంబై కైలాసంబు విలాసంబు డంబు విడంబించు దేవాలయంబు హర్షంబువొదలఁ దిలకించి పులకితాంగుండై బిల్వాదిపూజాద్రవ్యంబుల రామలింగేశ్వరు నర్చించి "కాశికాపురి నుండి గంగఁ దెచ్చితిని. ఈశ! దీనిని గ్రహియింపఁగదయ్యా" అని తజ్జలంబుల నమకచమకాదుల నభిషేకించి

గీ. అన్య మెఱుఁగక దేవ! యహర్నిశములు
దైన్యమున నీపదంబులఁ దలఁచి సుజన
మాన్య మా పరమార్థసంపద లభించి
ధన్యమతి నైతి నీదగు దర్శనమున.

కం. అంగములో సగ మంగన
కుం గడమ సగంబు భక్తకోటి కొసఁగి తె
బ్బంగి నిను గానవచ్చు భు
జంగాద్యవిభూష గోపసంగవిదూరా.

మొదలను పద్యంబులం బొగడి హనుమదాదుల కెఱఁగి మఱియు నందలి యిర్వదినాలుగు తీర్థంబులఁ గృతస్నానుండై గంధమాదనపర్వతంబుఁ బొమ్ముట్ట నధిరోహించి సింధుబంధను శ్రీపాదంబుల స్మరించి పిదప సేతుమాధవు పదంబుల మూర్ధంబుసోక మ్రొక్కి యుభయసాగరసంగమంబున నుచితవిధులు నిర్వర్తించి యందు దినత్రయం బుండి పిదప సీతాకాంతరాముల సేవించి యందుఁ జింతలపాటి లక్ష్మీనారాయణాఖ్య భూసురగ్రామణి వేడుకలు మెయి రామకథ విన్పించి మఱల సేతుమాధవు దర్శించి,

సీ. తగఁ బ్రయాగపురి మాధవుఁడు నీక్షేమంబు
నడిగినాఁడని తెల్పు మనియెఁ బ్రీతి
జాహ్నవి నీ పాదజలజంబులకు మ్రొక్కె
యమున నీదాన నే ననుచుఁ బలికె
సరసరస్వతి నిన్ను బహుగతుల్ వినుతించె
నన్నపూర్ణ నమామి యనుచుఁ బలికె
కాశీశ్వరుఁడు నిన్ను ఘనముగా వినుతించెఁ
దక్కు సురల్ నీవె దిక్కటనిరి
భైరవుఁడు నంది మేము నీ బంట్ల మనిరి
వినఁగదే యుత్తరక్షితి విషయము లివి
తెలిపినాఁడ నిఁ స్థితిఁ జెలివిమీర
సేతుమాధవ వినవయ్య చిత్తమలర.

ఉ. కోరికదీరె నీ చరణ కోమల యుగ్మము నాశ్రయించుటన్
గోరికదీరె గంగ నిటఁ గూరిమి లింగని కొప్పగించుటన్
గోరికదీరె సేతువునఁ గొంకక స్నానము లాచరించుటన్
ఊరికిఁ బోయివత్తు దయయుంచుము నీమది సేతుమాధవా.

అని నమస్కరించి కోటితీర్థంబుఁ గరంబు ముదంబునం గ్రహించి తదనంతరము దర్భశయనముఁ జేరి శ్రీరామునకుం దండప్రణతుండై శ్రీరంగముఁ జేరి,

గీ. ఓర గోవిందరాజైన ననుజుతోడ
వీఁడు మనవాఁడు చూచి కాపాడు మనఁడు
ఓర యిటువంటి వేళ మీ యవని నొప్పు
మతియొకట నుండ దీక్ష వేయిమాట లేల?

ఇట్లనేక విధముల నిష్ఠురోక్తులు పలికి యార్తిమెయి నిద్రించుచుండ.

సీ. రజతాద్రికాంతి నిరాకరించెడి మేని
చందంబుఁగల్గు నశ్వంబు నెక్కి
మల్లెపూలంగిపై మణులకట్టి బిగించి
వల్లెవాటుగ ఖండువా నమర్చి
మణిమయ మకుటంబు మస్తకంబునఁ దాల్చి
దండిసొమ్ములు మెయినిండఁ దొడిఁగి
ఎడమచేతను కళ్లె మిరవొందఁగాఁ బట్టి
తక్కినచేత శెత్తంబుఁ దాల్చి
కులుకునడకలు దుముకులు కొసరు కొసరు
మాపులును గల్గి జనములు చోద్యమంద
దాపు కేతెంచి నరసింహదాస! యిందు
రమ్మనఁగ నేను నతనిఁ జేరంగఁ జేగి.

నమస్కరించి నిలువంబడి యద్భుత సంభ్రమంబున మందహాససుందర
ముఖారవిందుండై యా శేషాచలుఁడు.

గీ. నీవు మావాఁడ వనిక దా నిజముదెలిసి
నాదు విధ దాఁట నేరక్క గాదుగానఁ
బర్వతం బెక్కవలదని పల్కినాఁడఁ
గూడదను పనిఁ జేయంగఁ గోరనేల!

పంచచామరము—

నగంబుఁ జూచు కోర్కె నీమనంబునందుఁ గల్గినన్
... ... ... ... రమ్ము ... ...
... ... ... ... ... ...

క. అని శైలమునకు నడుఁడో, జ్ఞానినని నుపంగఁ గంటి గోగర్భంబున్
ఘనపాపనాశనంబున్, గనగంగాధార మున్నగా సర్వంబున్.

మఱియు మరి పెంపు పెంపుమెయి,

సీ. నీలఘనాఘననిరుపమ దేహంబు
నంద బీతాంబరం బమరువాని
నరిదరశార్ఙ్గగదాదిసాధనములు
హస్తచతుష్కమం దమరువాని
రవికోటిదీప్తి నిరాకరించెడు కాంతి
గల కిరీటము తలఁ గల్గువానిఁ
గస్తూరివాసనల్ గ్రమ్మెడు మెయినిండ
సొమ్ములం దాల్చిన సొగసువాని
వక్షమున శ్రీమహాలక్ష్మి వరఁగువాని
ఘటకపు రత్నకాళ్లె జీరాడువాని
వేంకటాద్రీంద్రనిలయు శ్రీవేంకటేశుఁ
గాంచి సేవించి యిట్లు వచించినాఁడ.

* * *

అని యెన్నియో రీతులం బొగడి మతియుం గల విచిత్రంబులం జూచి,

గీ. అవ్వనటియఁ జూచి యాశ్చర్యమొందుచు
నాజ్ఞవడసి యమ్మహాద్రి డిగ్గి
మతియుఁ గల్గుచోట్ల మహిమమెల్లను గాంచి
మేలుకొంటి నంతఁ జాలవేడ్క

ఇట్లు మేల్కొని యిది సత్యమా? అసత్యమా? యని తలంచు
చుండ ఘ్రాణతర్పణంబుగా సుసౌరభ మేతేర నది యేమని యన్వేషిం
చుచో నాళయ్యపై శ్రీవేంకటేశ్వరుని పాదచిహ్నము సురభిరజోలేశ
ముండం గాంచి దాసు విస్మితుండై లేచి తోడివారలకుం జూపి యాహరి
పాదరేణువులఁ దలపై ధరించియు నాఘ్రాణించియుఁ గన్నుల నద్దుకొని
యు భగవత్కృప గల్గెనని హర్షాత్ముఁడై తృప్తుఁడై నిమీలితనే
త్రుఁడై స్వప్నగోచరపురుషుని భావబలంబునం బరికించి యానందాతి
శయంబున నృత్యంబుచేసె.

అంతటఁ గనులువిచ్చి తోడివారి సొగసులకు లజ్జించుచు నవ్వేళప్పు
ని వింతచెయ్వుల నంతరంగంబునఁ జింతించుచు నటనుండి కదలి యల
మేలుమంగను సేవించి గోవిందరాజుల కానందంబున నమస్కరించి

సీ. శ్రీపాదరేణువు "చిన్నంవరా" యంచుఁ
బల్కు వైష్ణవపరిభాష వింటి
స్వామిప్రసాదసంప్రాప్తంబుఁ గోరిన
వెల చాలహెచ్చను విధముఁ గంటిఁ
గడ కాస్థలపు మన్ను కా సివ్వకుండంగఁ
జిక్కఁబో దనువార్తఁ జేరి వింటి
వింతవింతలుగల వెలలేని పటములఁ
గన్నులపండువుగాఁగఁ గంటి
భక్తి యొంటియున్నఁ దైకంబు లేదని
సర్వసాక్షియైన స్వామి కొలుక
గాన నతఁడె నన్నుఁ గని బ్రోచు వేల్పని
యాపురంబుదాటి యవలి కరిగి.

కాళహస్తి దాసి యా స్వామిని బ్రార్థించి తొంటిమార్గమున
మఱలఁ బొన్నూరువచ్చి యావల గుంటూరు ప్రవేశించి వేడ్కతోఁ
దల్లి కాలఁగి, మ్రొక్కినయనుజాని దీవించి భార్య సపర్యల నంగీకరించి
జననికై తెచ్చిన కోటితీర్థంబున నామె నభిషేకించి మాధవప్రీతిగా
సమారాధనాదికము నిర్వర్తించి ఫలము రామార్పణమని యాత్రాదిశే
షంబులఁ దనకష్టసుఖంబుల నందఱకుం దెల్పుచునుండె, "పోయి సేవింప
లేకున్నఁ బుణ్యతీర్థమహిమ వినుటయు నఖిలకల్మషహరం" బని తీర్థ
మాహాత్మ్యములఁ దెల్పుచునుండె. ఈ యాత్ర వృషవత్సర ఫాల్గుణ
శుద్ధపాడ్యమికి సమాప్తమయ్యెను.

అంత శ్రీరామనవమికి మరల భద్రాద్రికేగి వచ్చెను.

ఇట్లే నృసింహదాసు నిరంతర ప్రయాణములచే నారోగ్యము చెడిపోవఁగాఁ గొన్ని దినంబులు వ్యాధిబాధ ననుభవించుచు "స్వామీ! ఒకచోఁ బడియుండి నిరంతరము నిన్ను స్మరించుటకా యిట్లు కదలలేని దశను గల్గించి"తని రాముని స్మరింపుచుఁ గొంతకాలంబునకుం దేరుకొని క్రీ. శ. 1826-27 వ్యయవత్సర పుష్య శు ౨ నాఁడు బయలుదేరి యుత్తరంబుగాఁ జనిచని యయోధ్యకేగి యా యా పుణ్యస్థలముల సభక్తికముగ నారాధించి సరయువున గ్రుంకులిడి పితృతర్పణ మొనర్చెను. వంశమును బవిత్రమొనర్చుటకుఁ జాలఁడా యొకఁడు? అట్లయోధ్యఁ గొన్ని నాళ్లుండి హరిద్వారమున కరిగి యటనుండి బదరికావనంబునకేగి నారాయణుం దర్శించి మ్రొక్కులిడి యా క్షేత్రమహిమముల వర్ణించి మరలి కొల్లడల బహుకష్టప్రయాణమ్ముల సర్వజిద్వైశాఖ శు ౧౧ నాటికి గుంటూరు చేరెను.

మరల భద్రాద్రి కేగి వచ్చెను.

## 3

ఇట్లెన్ని యాత్రలు చేసినను దనివి సనక యా భక్తాగ్రేసరుండు గరుడోత్సవంబు దర్శించు నాసమెయి విరోధివత్సర వైశాఖమునఁ గొందఱు భక్తులతోఁ గదలి కంచి కేగి స్వామిని సేవించి మరలి చెన్నపురికి రాఁగ వైదికబ్రాహ్మణుఁడును, మురికినాఁడను శాఖకుం జెందినవాఁడును, ధనాఢ్యుఁడు భక్తుడునగు నాగెండ్ల వరదరామదాసు వీరి నాహ్వానించి యుచితసేవలఁ దృప్తుల జేసి తారకమంత్రరాజ ముపదేశ మొంది తనయింట మాసత్రయం బుంచుకొని నిరతంబు రామకథ వినుచుఁ బిదప నాలుగువేలరూప్యములతో నరసింహదాసుగారి పాదపూజచేసి స్వామీ! మీ రింకొకమారు వేంచేసి నాకు భద్రాద్రిరాముని దర్శనభాగ్యము లభింపఁజేయవలయునని ప్రార్థించి, వీడ్కొలుపఁగా నరసింహదాసుగా రాతని భక్తిశ్రద్ధల కలరి యిది యంతయు నా శ్రీరాముని కారుణ్యాతిశయమని తలంచి గుంటూరున కేతెంచి మూఁడుతరంబుల నుండి పెరుగుచున్న ఋణమ్ము నా నాలుగువేల రూప్యిక లొసంగి నిశ్శేషముగాఁ దీర్చి ఋణవిమోచన సంతర్పణ మొనర్చి మరల చెన్నపురి కేగి వరదరామదాసుం దోడ్కొని విక్రుతిసంవత్సర చైత్రమాసమున బయలుదేరి శ్రీరామనవమి శుభయముల భద్రాద్రిని సముత్సుకత సందర్శించి ఇచ్చట నిచ్చలు నుండువారిది గదా భాగ్యమని తత్తర్యాలం గొనియాడి శ్రీరాముల సేవించి తిరిగి గుంటూరు వచ్చిరి.

అంత వరదరామదాసుగారు నరసింహదాసుగారిని సకళత్రముగఁ జెన్నపురికిం గొంపోయి యచట నాలుమాసము లుండి వైరాగ్యసంపత్తిచేఁ జెన్నపురి నుండ నిచ్చగింపక తన యావద్వస్తు వితతిని శిశుటాశ్యాదులపైఁ బూన్చి కదలి విక్రుతిసంవత్సర కార్తికమున భద్రాద్రి కరిగి కాఁపురముండి నిరతము రాము సేవించుచు నృసింహదంపతుల సంభావించుచు నా వరదరామదాసు దంపతులు సంతోషమునఁ గాలముఁ బుచ్చుచుండిరి.

## ౪

భద్రాద్రి శ్రీరాములకుఁ గైంకర్య ముసేయువారు ధనాశా పీడితాత్ములై శ్రీరాములవారి ధనము హరించుచుఁ దత్తత్కాలోచిత సేవల సలుపక యేరినిం జేరికిఁగొనక సంచరించుటం జూచి నృసింహదాసు శ్రీరామచంద్రా! నీకు సేవలు సక్రమముగా జరుగుటలేదు నే నెట్లు సహింపఁగలను? అని విచారించి నిద్రింపఁగా నారేయి స్వప్నమున నొకవైష్ణవుం డరుదెంచి "నృసింహా! వగ పేల? చందూలాలు దర్శింపం బొమ్ము, అన్నియుం జక్కనగు"నని పలికి చనిరెను. అంత దాసు మేల్కాంచి వరదరామదాసుతో స్వప్నవృత్తాంతముఁ జెప్పి శ్రీరామాజ్ఞగా భావించి సభక్తి నమస్కరించి హైదరాబాదునకు బయనమై చనిరెను. భక్తుల భావంబులు భగవంతుని కెఱుక. భగవంతుని భావంబులు భక్తుల కెఱుక.

ఆ కాలమున నిజాం రాజ్యము నసు నాసరద్దౌలా నవాబుగా నుండెను. హైదరాబాదే రాజధాని. అతనికి మహారాష్ట్రబ్రాహ్మణుఁడును, ధర్మాత్ముఁడును, పండితాసనుండును, సద్వృష్యుండును, సన్మార్గప్రవర్తకుండును, సమగ్రుండునగు చందూలాల్ ప్రధానామాత్యుఁడుగా నుండెను. పుణ్యాత్ముఁడగు నామంత్రి కొకనాటిరేయి కలలో రాముఁడు కన్పడి "ఓరీ! నృసింహదాసు నీచెంత కేగుదెంచు, అతని యిష్టము నెఱవేర్పుము." అని పలికి యదృశ్యుండు కాఁగ మేలుకాంచి యద్భుతంపడి తనజన్మము సఫలమయ్యె నని తలంచి శ్రీరామచంద్రు ధ్యానించి "ఎప్పుడు నృసింహదాసు వచ్చెంచునో? శ్రీరామున కాదాసుమీఁద నింతప్రేమ యుంట కా మహాత్ముఁ డెంత తపస్సు చేసెనో కదా! నృసింహదాసు కారణమున నేనును కృతార్థుఁడనైతి. ఆ దాసు చరణంబుల నెన్నఁడు చూడ గలుగునో?" అని తలంచి దినంబులు పుచ్చుచుండ శ్రీ లక్ష్మీనృసింహదాసు కతిపయదినంబులకు హైదరాబాదున కేగి సంధ్యాకాలము మందిరంబున కానందంబునం జరియం జను సులభోపాయంబున లోనికరిగి రాజాధిరాజ సలాం మొందు మ్రొక్కి . నరసింహదాసనన్నాముండు" నని చెప్పినంత

" దగ్గర గద్దెను దిగి డాయవచ్చి  
బిగ్గఁ గౌఁగిటఁ జేర్చి విసఁ జందులాలు  
శ్రీరామచంద్రు సత్కృపఁ గాంచినట్టి  
భూరిసత్తాపసపుంగవు నిన్నుఁ  
గంటిఁ గన్పండువుగా నేఁడు దేవ!  
బంటునై నీకు నే పనిసేయువాఁడ  
నమ్మి నా యిలు పావన మ్మొనరింప  
రమ్మంచు నంతఃపురంబులోపలకుఁ  
గొని చని పదములకును జాగి మ్రొక్కి  
ఘనతరకరుణ నన్గనఁగదే యంచుఁ  
గలలోన రాముండు కరుణ నేతెంచి  
తెలిపిన వద్వార్తఁ దెలియఁగాఁ జెప్ప

శ్రీరామ నవ్యాజకృప రాజిలుటకు
భూరిహర్షావేశమునఁ దన్ను మఱచి
ఆనందబాష్పంబు లధికమై కాఁగ
మేనెల్లఁ బులకలు మెండుగాఁ జార
గద్గదకంఠుఁడై కను నోట మాట
లుద్గమింపక చేష్ట లుడిగి యొక్కెడకు
నల్లనఁ దెలివొంది............
నీరజోద్భవుఁడైన నెఱిఁ గాంచరాని
శ్రీరామచంద్రు వీక్షింపఁగల్గితివె?
ఘనతర సత్తపః కలితుని నిన్నుఁ
గను మాత్రఁ బాపముల్ గడతేరు నన్న."

అని యుచితాలాపంబులఁ గొంతప్రొద్దు గడపి వంమాలాలు ప్రార్థింపఁగా వానికిఁ దారకమంత్ర ముపదేశించి యొక నాఁడు తాఁ వచ్చిన కార్యంబుం దెలిపి రామకైంకర్యము సక్రమముగా జరుపుటకుఁ దదధికారము నాకింసన,

"నీకొక్క దేవళంబేల...
భద్రాద్రి పాల్వంచ పరగణాలెల్ల
భద్రంబుగా నీవు పాలింపఁదగుదు
నా యుర్వికెల్ల నీ వధికారమూని
చేయుము న్యాయ సంసిద్ధిఁ బాలనము
రాజితమైనట్టి రాజాబిరుదము
నేఁ జెల్వుగా నిదె నీ కొసంగితిని
చెలఁగి నిక 'రాజానృసింహదా' సంచుఁ
బిలుతు రింకటినుండి......"

అని దాసు.గారు నిరాకరించుచున్నను "ఒక్క శాసనంబ్బట్టె లిఖించి
మనమార నా మహామహుల కొసంగె......
మఱియు నొంటెలు రెండు మత్తేభయుగము
తురగవతుష్క మెంతో భక్తి నొసఁగె
పరిషేషుధాయిాలు పరిగంచు నేల్వ......"

లు నరసింహదాసున కొసంగి మహావైభవంబున సాగనంపె.

అంత నద్దాసవర్యుండు ఖరసంవత్సర ఆషాఢ బ ౧౮ నాటికి భద్రాద్రిఁ జేరి సర్వము రామార్పణమ్ము నేసి నాటినుండి భద్రాద్రి తాలూకా కధికారియై మంత్రిదర్శన మగుటయు నీయధికారము లభించుటయు నంతయు రామచంద్రా! నీ కృపాతిశయమున నే యని తన లోఁ దలంచి నమస్కరించి యమ్మహావైభవంబునం దగుల్కొనక "లోక సంగ్రహార్థంబు కర్మాచరణంబు చేయుఁగతి మనంబునఁ గామమోహితులుగాక యర్థిమై యుక్తకర్మంబు లాచరించి ప్రకృతిసంబంధమును బాసి భవ్యనిష్ఠఁ దనిలియుం" డెడి యుత్తముల భంగిఁ బ్రవర్తించును శ్రీరామకైంకర్యములు సక్రమముగాఁ బ్రతినిత్యము నెఱవేరుచుండున ట్లాపాటించె. అప్పటి భద్రాద్రి వైభవంబు వర్ణింప నలవిగాకుండె.

దేవాలయాధికార మిమ్మనఁ జందూలాలు భద్రాద్రితాలూకాక యధికార మిచ్చె. రామకైంకర్యము నిమిత్త మకోద్యోగమును స్వీకరింపవలసిన వాఁడయ్యె. లేకున్న భక్తుఁడగు విరాగికి గశాంతైశ్వర్య మేల?

"రాముని కుదయాది రాజిలఁదగిన
శ్రీసుద్విఘుల కొప్ప చెల్వంపుఁగృతులు
గద్యపద్యాదులు కడు హృద్యములుగ
విద్యాగసప్రౌఢి వెలయఁ గావించి
శ్రీరామ సత్పదాంచిత పూజలందుఁ
గోరికలార నెక్కొనఁగ స్థాపించెఁ
బాడుచుం ద్రెల్ల రిప్పటికి వాకృతులు
వేడుక నా రఘువీరు సన్నిధిని."

ఇట్లుండ నా కాలంబున క్షామంబు సంభవించె. నందన కఱవు నేటికిం బ్రసిద్ధంబ కదా? అప్పుడీదాసుగారొనర్చిన సేవ యపారము. భద్రాద్రియం దీతఁడున్న సత్రము నెలకొల్పుటచే బ్రతిగ్రామ ప్రజలు నిపటికే రోఁశేగ

"ఎందఱు వచ్చిన లేమిపో యంచు
సందఱ కొనరించె నన్న దానంబు
శిశువులకును బాలు చేరి యిప్పించెఁ
బశుసమితికి మేఁతఁ బాటించి కూర్చె
వారమునకు నొక్కపరి తల గడుగు
లారంగ స్త్రీబాలకాళి కమర్చె
మాలమాదిగల కేమరక యన్నంబుఁ
జాలుఁ జాలనఁగ లెస్సగ సమకూర్చె
ముమ్మార్లు భోజనంబులు చేయువారు
ముమ్మార్లు తిను విధంబున నమరించె
పాత్రలు చాలక బలుగచ్చుగుండ్లు
చిత్రంబుగాఁ గట్టి చేర్చెఁ బక్వములు
ఆనాఁడు కట్టించినట్టి కుండంబు
లీనాటికిని నిల్చి యొసఁగు భద్రాద్రి"

ఇట్లు విజయవత్సర శ్రావణమువఱకు జనులఁ బోషించె. అంత వర్షము గురిసె, జనము మురిసె, సుభిక్షము గరిసె.

ఎట్టివారికిం బూర్వకర్మానురూపఫలం బనుభావ్యంబ. నాగిండ్ల వరదరామదాసు గారికి క్షయరోగము సంభవించె. నానాటికిం గృశించుచుండె. "కాయంబు బుద్బుదప్రాయంబనియు, నైశ్వర్యంబు నశ్వరం బనియుఁ, జావు కాయమ్మన తావనియు

"నినుఁ జెన్నపురినుండి నే భద్రగిరికి
ఘను రామసేవలకై తెచ్చినట్లు
వైకుంఠమునకు నొప్పఁగ నిన్నుఁ గొంచు
పోయెదననియు, నిది రామాజ్ఞ"

చెలువకు మనియు నృసింహదాసతని మాఱడించి తత్సన్నాహంబున నుండ వరదరామదాసు భార్యయుఁ దల్లియు మేమును మీ వెంట వచ్చెదంతు మన వల్లెయని తనభార్య లక్ష్మీబాయమ్మ నాకును సెలవిండు; మిముఁ బాసి ధర నిల్వనేరననఁ గొంతవట్టు విచారించి నీకు భగవదాజ్ఞ లేదు; భూమియం దుండు మని చెప్పి మఱియుం గొందఱుభక్తులు మమ్ము మీతోఁ గొంపొండు శ్రీరామునితో సాకేత పౌరు లరుగించినట్లు మీతో వచ్చెదంతుమన మీమీ యిచ్ఛఁ బోవ్వనఁ జేయుఁడు; విధిని మాత్రము దాట నేరితరముగా దని పల్కె. ఆహా! మనభక్తాగ్రేసరుని యం దెంత విశ్వాసమో యానాటిప్రజకు!

దాసు తనయింటఁగల స్వర్ణరజతమయాది సర్వవస్తువులకు జాబితాలు వ్రాయించి రామాలయముం జేర్పించి వలసిన వస్తువుల వలసిన వారి కొసంగి

" ఏమియు లేకుండ నిల్ చూఱవిడి చి
యామీఁద రాజకీయప్రసంగములు
దేశపాండ్యాలకుఁ దెలియబోధించి
వ్రాసిగా సచ్ఛిలాన్వయ శాసనముల
పైని శ్రీరాము సర్వస్వర్ణరత్న
మానితాభరణముల్ మఱి యిన్నఁదగిన
స్థిరచరాస్థుల పేర్లు చేర్చి చెక్కించి
సరగఁ గోవెలయందు స్థాపనచేసి".

మఱియు వరదరామదాసు నాలుసెలల పుత్త్రి దాసి చేతులం దుంచి సాకుమని చెప్పి తనయొద్దనున్న తమ్మునికుమారు రామాఖ్యుని దీవించి మహాప్రస్థాన మహోల్లాసంబున నుండునంత వరదరామదాసు విగతాసుండయ్యె.

అంత జనులందఱు విస్మయస్వాంతులై చూచుచుండంగ వారిపై మనసుబును దిరముకొలిపి వరదరామదాసు శవంబును వెంటఁదీసికొని, కాళ్ళకు గజ్జలుగట్టి చేతఁ దాంబురఁ బట్టి కంఠంబు లెత్తి భక్తులతోఁ గలిసి పాడుచు నృత్యంబుసేయుచుఁ గదలి

కాంభోజి రాగము

"పోయెదమయ్యా! వైకుంఠమునకు పోవుచున్నాము॥ పో॥
శ్రీ రఘుపతిని దలఁచి భక్తశ్రేణులకు దండములు పెట్టి॥ పో॥
మోదముతో గోదావరి-నాధారము చేసికొని
సాధుజనులవెంబడి మేము-సరగున శ్రీరాములజాడ॥ పో॥
కూరిమి రాముఁ డిచ్చిన-భూరిసంపద్వ్రాత మెల్ల
కోరికలారఁ గ్రమ్మర శ్రీరాముని సన్నిధిఁజేర్చి॥ పో॥
కోరి యీశరీరముల-శౌరి కర్పణము సేయఁ
శ్రీరామభక్తులును-నారసింహదాసుఁడనౌ నేమును॥ పో॥

ఆదితాళము

అడుగో కోదండపాణి-అడుగో భద్రాచలేశుం॥ డదుగో॥
అళిసముదయముల-నదలించెడు బల్
తళుకు ముంగురుల-చెలువులు గలవాఁ॥ డదుగో॥
చందురు రుచి కడు-మందముచేసెడి
పొందు గలుగు మో-మందము గలవాఁ॥ డదుగో॥
తీరుగ కస్తురి-తిలకము మెఱయఁగఁ
జాల భ్రూయుగపు-సైగలు గలవాఁ॥ డదుగో॥
వెన్నెల నీనెడు-సన్నపు నగవులఁ
జెన్నలరెడు నా-పన్నరక్షకుం॥ డదుగో॥
కంబుకంఠము స-ఘనరుచి గల ర
త్నంబు మెఱయు శ్రీదశరథరాముం॥ డదుగో॥

... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ...
... ... ... ... ... ...

వాసిగ భద్రగి-రీశుఁ డనుచు భువి
గ్రాసిలు నరసింహ-దాసునేలువా॥ డదుగో॥

అని పెక్కు తెఱంగులఁ బాడుకొనుచుఁ (క్రీ-శ-1833-34) విజ[య] సంవత్సర భాద్రపద కృష్ణచతుర్థీ సౌమ్యవాసరమున రవి పశ్చిమాద్రిఁ జే[రు] తఱి గోదావరీనదిం జేరి పడవపైనెక్కి భక్తబృందముతో భజనసలుపు[చు] నితరజను లీ యద్భుతముం జూచి కొన్ని పడవలపై నెక్కి వచ్చుచుఁ [ప]రివిధములఁ దలంచుచుండ గోదావరివారి సముత్సాహంబునం [జో]తరంగహస్తంబులం బిల్చుచుండ "జయ రమారమణ గోవిందా హరి" [యను] రావంబు భూనభోంతరంబులు నిండుచుండ, వేలకొలంది జనంబు[లు] నదియొడ్డున బరివేష్టించి ప్రతీక్షించుచుండ, నదీమధ్యకరిగి ముందు వ[రద]రామదాసు కళేబరము గంగలోఁగలిపి రామరామారామరామా యం[చు] నా గోదావరీతరంగంబులఁ గౌఁగిలించుకొని నృసింహదాసానదం[డు] దదృశ్యుఁడయ్యె. మిగిలిన పదునేడుగురు భక్తులు గుంపులున నాగో[దా]వరిలో దుమికిరి. అంతలో

"...వింతగా నొక్క దివ్యవిమలతేజంబు,
ఘనతరదివ్యప్రకాశంబు మించి
జనములు చూడంగఁ జని వియద్గతిని."

జనులంద ఱది నృసింహదాసు తేజంబని తలంచి యద్భుత మం[ది] సజ్జనులతోఁ గలసిమెలసి తిరుగువారు పవిత్రులగుటకు సందియ[మే] అట్టిపవిత్రుల కిట్టిదివ్యసంవర్ధన మబ్బుటకేమి? భక్తులందు గ్రామం నునికి గల్గుటయుఁ బూర్వసుకృతపరిపాకమున నే.

అంత నృసింహదాసు భార్య లక్ష్మీబాయమ్మగారు తరుఖ ధారమునఁ దేలియాడుచుండ నామెయు, పిచ్చయాఖ్యుండను భక్తుఁ ద్రష్టలచే రక్షింపఁబడిరి. మిగిలినవారి శవంబుల వెదకి వెలుపలికిం [దెచ్చిరి] కాని యెంతవెదకినను వరదరామ నృసింహదాసుల శరీరములు మా[త్రము] కన్పింపవయ్యె. సరయూనదిలోఁ గలిసి యా భక్తబృంద ము

రాముఁడు మునిఁగి వైకుంఠమున కేగినట్లు నృసింహదాసే గాననియు, రాముఁ డీతని కెల్ల వేళల నెడబాయక చూచుచుండుననియు, పలయు సర్థంబు స్వప్నంబున బోధించుచుండుననియు, నిట్టివారి మహిమము లే భగవదాస్తికత నెల్ల డించుననియు,ఁ దొల్లిటిగోపన్నయే యత్యంత కష్టకాలము ననుభవింప నిట్లు పునరుద్భవించె నేమో యనియు నిట్టి భక్తజనములవలనఁ గదా ధరాతలము నిలిచియున్నదనియు, నేటికిని జను లనుకొనుచుండిరి.

పిదప లక్ష్మీబాయమ్మగారు ముప్పదేండ్లు జీవించిరి. ఈ వార్త చందులాలాలకించి రైయిదుగ్రామము లామెకొసంగి గురుభక్తి ప్రకటించెను.

వ్యాస విస్తర భయగ్రస్తుఁడనై సంక్షేపముగా వ్రాసితిని.

ఈ వ్యాసము ముగించుచు నింక రెండుమాటలు వ్రాయకుండఁ జాలను.

కలఁడుగదా యీ లక్ష్మీనృసింహదాసుగారికి తమ్ముండు కృష్ణదాసు సంగీతశాస్త్ర ప్రవీణుండు. అతని కుమారుండు రామాక్షీధానుండు సద్గుణుండు కలండు.

ఆ రామార్యునకు జానకమ్మ యను మా చిననాయనమ్మ నిచ్చి పెండ్లిచేసిరి. ఆ జానకీరాముల కేడ్గురు పుత్త్రులు జనించినను నొక్క సీతారామయ్యపంతులు మాత్రమే సజీవులై యుండిరి. వారి కమ్మగారన్నంబుతోఁ గూడ నపరంజిరేకుల నారగింపఁ జేసెడిదఁట. కావుననే బంగారువంటి శరీరచ్ఛాయయు మేల్మి గొనంబులం గలిగి చక్కదనాల కిక్కయైరి. అట్టి సీతారామయ్యపంతులుగారు సంస్కృతాంధ్రములనే గాక హిందూస్థాని యందును ప్రావీణ్యము సంపాదించి "తాలూకా హెడ్ అకౌంటెంటు" పదవి ననుభవించి శ్రీరామభక్తుఁడై భక్తకల్పద్రుమాద్యనేకగ్రంథముల రచియించి తనివిసనక తమ వంశతిలకుఁడగు "శ్రీరామ లక్ష్మీనృసింహదాసు చరిత్రము" నాబాలగోపాలము పఠించుటకు ముఖ్యముగా స్త్రీలు పాటవలెఁ బాడుకొనుటకుఁ దగినట్లు ద్విపదకావ్యముగా రచించిరి. నా యీ వ్యాసమునకా మాబాబుగారి గ్రంథమే యాధారము. వారును వారి తండ్రిగారివలనఁ బితామహపవిత్రకథల విన్నవారగుటచే నిందతిశయోక్తులుగాని కల్పనలుగాని చేరలేదు. మఱియు శ్రీ లక్ష్మీనృసింహదాసుగారు స్వయముగా రచించిన పద్యముల నిం దుదాహరించుటచే నాసందియమున కవకాశము లేనేలేదు. ద్విపదను మాత్రము మాబాబుగారి గ్రంథమునుండి కైకొంటిని. వారికవితాశైలి అనర్గళధారాప్రవాహము వర్ణింప నేనెంతవాఁడను? చదువరులారా, మీదే యాభారము. వినుఁడు

"ఆ కాలమందుఁ బ్రయాణముల్ సేయు
సౌకర్యము లెట సెసంగకయుండె
ధూమశకటము లెందుఁ దనర్పవపుడు
భీమకానన పరివృత మీధరిత్రి
క్రూరభల్లూకశార్దూలవరాహ
వారసంచార దుర్వార వనములు
చోరసంఘములు నిల్చు విపత్పథములు
ఘోరదవాగ్ని వెల్గు ధరాధరములు
కంటకసర్ప సంకటదుఃస్థలములు
నుంట కిరవ్వొసఁగని యూళ్లు పురములు
జల మెందు లేని దుష్టప్రదేశములు
నిలువనీడ యొసంగని జనవ్రజములు
పలుకులు తెలియని భాషాంతరులును
వెల కేదియేని లభింపని యూళ్లు
కలిగి యకాలదీర్ఘ ప్రయాణములు
సలుపు టత్యంతదుస్తరములైయుండె.
నట్టిదుష్కాలంబునం దీమహోత్సుకోత్కృష్టములైన సెంగక ఘృతిని
భరతఖండమున నేపారెడి ఘన్య
తరయాత్రలన్నియుఁ దవిలి కావించె."

ఇట్టివానిం గన్న గుంటూరు గదా ధన్య.

"చిన్నతనమునుండి శ్రీవిష్ణుభక్తి
హృన్నిలయంబునం దెసగించె నితఁడు
ఉద్యమింపక పాలనోద్యోగ ముడిగి
వేద్య మంచెంచె శ్రీవిభుపాదసేవ
కడుబీద యయ్యును గడుపుకక్కుర్తిఁ
బడి యన్యులను వేడఁ బాల్పడకుండె
పుణ్యయాత్రలకల్లఁ బోరాగాల్నడల
గణ్యుఁ డీతఁడు భక్తగణములం దెల్ల
చందులాల్ స్వప్నంబునం దచ్యుతుంపు
సంధించి పల్కనే సగగ నాగతని
ఘనతరరాజ్యాధికార మీలీలఁ
దనరునే త్రుటి నెట్టిదాసులకైన
"తన మాహాత్మ్య మంతయు రాఘవునకు
ఘనభక్తి నర్పణ గావించెఁ గాని
యను వొప్పనొక గవ్వయైన నిజాప్త
జనులకు నిచ్చెనే సంగిరా యితఁడు
భక్తి యీపురుషరూపంబు ధరించి
వ్యక్తంబుఁ జేసె సవ్యర్తనంబులను
నలువదేండ్లీతఁ డెంతయు గాఢభక్తిఁ
బలుకష్టముల కోర్చి వసుధపై మనిరా
అనఘుఁ డియ్యతని శుభాఖ్య స్మరించు
జనులు నిర్గతపాపసంఘులై యుంద్రు."

## ముత్యాలు

పూడిపెద్ది వెంకటరమణయ్యగారు (కవితానమితి)

౧

చివురు మేసిన కోయిలే చిన్నిచిన్ని
గీతములఁ జేయ మధురసంగీతరచన
ఫలరసాలను ద్రావు నీ చిలుకకొదమ
పాడదేమమ్మ, పెదవుల పవడ మదర?

౨

ఈ ప్రశాంతనిశావేళ నెచటి దచటఁ
బ్రకృతి గంభీరగళమె నిద్రను మునుంగ
విపినవీథిని దిరుగాడు వెఱ్ఱిలేఁటి!
ఎగయు కంఠాన శ్రుతిఁ గూర్తు వెవనికొఱకు?

౩

సుధల వెదఁజల్లు నీ తెలిచుక్క వెలుఁగె
యనుభవింపని మోహశూన్యంపు టెడఁద
యీ జగత్సీమ-ఓ శశీ! యేల గోరి
యొలుకఁబోతువు పండువెన్నెలల తళుకు?

౪

ఎనసినంతన నులివెచ్చఁదనము లేని
చెలితి కౌఁగిలి-క్రొవ్వాడి వలపు చెమ్మ
లిగిరిపోయిన హృదయ-మిం కేల నాకు?
వట్టి గుసగుసలో మందపవన! యిట్టి
(?) మార్గశిర నిశాపర్యంక మధ్యమందు!

౫

మోహవనవాటి నెన్నెన్ని పూలు లేవు?
వెదకి తెచ్చితి నచటి చాంపేయసుమము
కోరికలు దీర మనసార నారగింపఁ
దేని లేదని యలిగి గద్దింతు నెవని?

౬

గడగడ వడంకు నా కనికరపు టెడఁదఁ
గూర్చు కన్నీటిముత్యాల క్రోవ లెల్ల
నిగిరిపో వేఁడియూర్పులు జుగులుకొల్పి
చిన్నపోయితిఁ గపగంటఁ జెమ్మ లేక!

౭

కమ్మని రసమ్ముఁ జిలుకు రాగమ్ము మేసి
కోనకడ కేఁగె మధుమాన కోకిలమ్ము!
రంగవల్లుల నిడి భవత్ప్రాంగణమున
ముదురుటాకుల తోరణములు రచించి
వేచియున్నావె ముసలి పెండ్లికొడుక?

౯

కడలి వెలుఁగొందు తళుకునిక్కడల నలరు
నాణెముత్యాలు కడలిగర్భాన డాఁచి-
యేల గురియింతు వి ట్లుషనెపఁ గదల్చి,
యడఁగిపోయెడు మంచు ముత్యముల జల్లు?

౯

జాలు జాలుగ విరియు నీ పూలవేళ
నెగుడుదిగుడులఁ జిన్నవోయినది బీడు!
నందనోద్యాన కుసుమసంతతులు మాని-
పులకరింపంగఁ దంగేటిపొదలు లేవె?

౧౦

ఫలరస మ్మయి తేనియ పలుచఁబారె-
కండ యై రేకు రేకునఁ గలసిపోయె-
వలపు చలి యయి లోలోన నిలిచి పోయె-
నలరుపై నేలఁ గనులు మోహమ్ము విడవు?

౧౧

జాలిచేఁ దూలి తొలిరహస్యముగ నెన్ని
వేఁడియూర్పులు నీమెద విడిచినానో
వడవడ వడంకు కౌఁగిలిపట్టు వీడి
మఱచితే నన్నుఁ గరువలీ, కరుణ మాలి?

౧౨

చిక్కిపోయిన నా తెలిచుక్క లంటి
దొరలు కన్నీటిధార ముద్దుల హరించి
యవల నీవల గుసగుస లాడి యాడి-
దండడించెడు నిట్టి నిదాఘువేళ
మఱచితే నన్నుఁ గరువలీ, కరుణమాలి?

౧౩

మురిపెములఁ జల్లు నీ తొలిప్రొద్దులోఁ
బూరికొన నాడు మరకతమ్మును దెమల్చి
కోసికొని డాఁచికొంటి సక్కన గదించి-
ఇంతలోనన జాముప్రొద్దెక్కిపోయె!
నవసిపోయిన యొంటితృణమ్మె మిగిలె!

౧౪

పనలు తీవియ సాగించు పడమటికొన
విడిన సంధ్యాప్రసూనమే వడలిపోయె!
అదరు తారకాతుహినకణాళి నిట్లు
దాఁటి యెటు పోవు నీ రేయి తేఁటికదుపు?

౧౫

పెదవిఁ దడుపని యీ తేనెపెరఁ గదల్చి
యీఁగపోటునఁ దూఁటువోయినది మేను-
తపము గైకొని మధుపగీతమున మునిఁగి
తేఁటినై నేను కన్నులు తెఱచువేళ
పూవు లన్నియు వసివాడిపోవునేమొ!

౧౬

వెగటుఁదనమునఁ గెమ్మోవి విఱుచుఁ జివురు
చిఱునగవులోన నెగతాళిసేయుఁ బూలు
క్రించుఁదనమున లత తల వంచికొనును
నిలువుపాటునఁ దరులు కన్నీరు రాల్చు
నదరు బెదరుల నను నేన యరసికొందు!

౧౭

చివురుదొన్నలఁ బూరేకు చిప్పలందు
వన్నియలు గూర్చి లేప్రొద్దు చిన్నిరేక
కుంచియలు కట్టికొనెదు నీ కొమరుఁ జూచి
కోకిలము రెక్కఁ జిత్రించుకొందు వంచు
సంతసించితి! నిది యేటి జాణతనము!
ప్రకృతిలోఁ గల క్రొందళ్కు వన్నె లెల్లఁ
గలిపి యీ యాకు చిలుకకే పులిమినావు!

౧౮

చిక్కువడి తారహారముల్ చెదర దెసల
కారు చీఁకట్ల కుచ్చెళ్ళు గంతు లిడఁగ
సందెమోమున మసిఁ బూసి సందడించు
నీ యమావాస్యరాత్రి యిం దెవనికొఱకు?

౧౯

నవరసవిహీన వేణుదండంబునుండి
చల్లుచున్నావు గానరసమ్ము నీవు!
తరుణమధురసపూర్ణేక్షుదండ మంది
పాడలే నేను తందనపదము నైన!

౨౦

సోగమే నేల? నీ వన్నెసొగసు లేల?
తళుకు లేలను? క్రొవ్వాఁడి వలపు లేల?
వెట్టిదానవు సుమ్ము చాంపేయ సుమమ?
తేనె గల పూల నెఱుఁగదే తేఁటికొదమ?

సత్య మాడంబరము లేక సంచరించు
కతమునన్ దాని నెల్లరుఁ గానలేరు;
కోరి యత్నించువో నీదు కుమ్మమునసె
దానిఁ గనుఁగొందు వీవు ప్రత్యక్షముగను.

కొండకోదులతోఁ జల్లి గుడుచుచుండు
బాలబాలికల గ్గూడి లీల నాడు
ధరణిపుల కిరీటమ్ములఁ దన్నుచుండు
సంయమీంద్రులతోఁ గూడి స్వస్తిఁ జెప్పు.

అద్ది బీజస్వరూప మయ్యది యెరింగి
యెవ్వఁ డద్దానిఁ గొని తన హృదయసీమ
యందు నాటునో యతని సర్వాంగములు వి
రాగ రేఖావిలాసపాత్రంబు లగును.

బలవిహీనముగాఁ గనుపట్టుఁగాక
యెముక వజ్రాయుధంబయి యెసఁగునటుల
సమయమున కనువగు జవసత్వములను
సత్యమే నీకు జేకూర్చు సంతతంబు.

సూర్యకాంతము రవి దిక్కుఁ జూచునటుల
నెంతదగ్గరైన వాన కోయిల యిలఁబడు
నీర మానక వానకై నిలుచునటుల
నాత్మ సత్యంబు నాశించు ననవరతము.

పిడుగు దనమీదఁ బడినను బుడమిలోన
నొక్కయడుఁగైన నిపదుగా యుర్విధరము;
చేతనాచేతనంబులు స్వీయపథము
లను ననుసరింప మనుజుఁడా! లాతిపథము

మానుమా! నీవు నాత్మాచ్ఛమార్గమందు
సంచరించుము, దాన మోక్షంబు గలుగు.
ఆత్మకు విభిన్నమౌ పరమాత్మ లేదు;
సత్య మాత్మస్వరూపము; సత్యభిన్న

మైవతము శూన్యమగు; నసత్యప్రవక్త
లగుదు రిల శూన్యవాదు, లీ వట్టివారి
సంగతిని మన నాత్మవంచకుఁడ వగుదు.
పరమపాపాత్ములైనను మరణముఖము

జొచ్చుతరి సత్యమాడుచుం జచ్చుచుంట
నరయ నాత్మస్వరము సత్య మంట నిజము;
మనుజుఁడా! వద్దు నీ కనుమానమిందు.
నీస్వభావసంగీతము నీవుపాడు

మంతియేఁగాని నీ వసత్యానులాప
గీతములు పాడఁబోకు; నీ గీతములను
మెచ్చుకొనుకాల మిలలోన వచ్చుదనుక
కోకిలంబటు మౌనముఁగూరి యుండు.

కాకి కలకాలమొకరీతిఁ గావుకావ
టంచుఁ గూయుచునే యుండునటుల నెపుడు
నీవు సత్యస్వరూపము కావటంచు
సత మసత్యప్రకృతి భువిఁ జాటుచుండు.

అల వివేకవసంతకాలావసరము
నందు నీ పరమరహస్య మరయనగును
ఘనతరులు—శ్రుతిసమ్మతఖ్యాతి నీవు
సత్యగానము జేయుము సంతతంబు.

---

# గోకులాష్టమి

శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మ గారు

౧

నిను గాంచిన జనని దేవకియు
నిను బ్రోచిన జనకుడు వసుదేవుడు
నిను బెంచిన యా గోపీదేవియు
నిను గాచిన యా నందగోపకుడు
నేమిటి జేసిరొకో పున్నెము లెన్ని భవంబులనో.

౨

నీవు జనించిన మధురానగరము
నీవు పెరింగిన రేపల్లెయు మరి
నీ వభివృద్ధిని గాంచిన బృందయు
నీవేలిన యా ద్వారావతియును
నేమిటి జేసెనొకో పున్నెము లెన్ని భవంబులనో.

౩

చిన్నతనంబుననుండియు నిన్నతి
సన్నుతి కెక్కిన ప్రేమంబున గని
మన్నన కెక్కిన నీ ప్రేమాంబుధి
గొన్నది గోపక సోదరీమణియు
నేమిటి జేసెనొకో పున్నెము లెన్ని భవంబులనో.

౪

నిన్ను నెదిర్చిన రజకాన్వయమణి
నిన్నర్చించిన మాలాకారుడు
నిన్ను నుతించిన సుమాలావికలును
నిను ప్రేమించిన దాసీమణియును
నేమిటి జేసిరొకో పున్నెము లెన్ని భవంబులనో.

౫

నీతో బోరిన చాణూరుండును
నాతుక పూతన నళినదళాక్షియు
నీతో బోరిన కంసక్షితిపతి
నీకృప గాంచిన సకలజనంబులు
నేమిటి జేసిరొకో పున్నెము లెన్ని భవంబులనో.

౬

నీవు జనించిన భారతవర్షము
భావుకభాగ్యసమన్వితమై కడు
గోవుల గాచెడు గోపాలుడవై
భువిలో భూతదయత్వము జాటగ
నేమిటి జేసెనొకో పున్నెము లెన్ని భవంబులనో.

౭

నీ వూదిన పిల్లనగ్రోవియు
నీవు జరించిన నిఖిలస్థలంబులు
నీవు ప్రేమచే గాచిన గోవులు
నీవు జనించిన గోకులాష్టమియు
నేమిటి జేసెనొకో పున్నెము లెన్ని భవంబులనో.

౮

భావ్యంబై బహుజనులకు నిలలో
సేవ్యంబై సంస్మరణీయంబై
నేడును నాడును వేలావలయిత
హిందూజనుల హృదంతరమందున
వెలిగెడి నష్టమియే భూమిని జెలగెడి నీదినమూ.

---

# మణిపాయ

ఆనందకృష్ణ [కవికుమారసమితి

ఆ వసంతదినాంతసంధ్యావసాన
సాంద్రరాగారుణచ్ఛవి(?)స్రోతసలిల
నిర్మలప్రేమక్రీడితానిలకుమార
హాసపరిహాసముల కోడి మోసపోతి.

* * * *

నావలెనె యామె గ్రహియించె ; సతతపునీత
కుటిలకుంతలములు చిక్కుగూడుకట్ట
శల్యపంజరమట్టుల సన్నగిల్లి
మిలమిలని జారు మణిపాయ సలిల మలసి.

* * * *

ఆపుకోలేని ధ్యానసల్లాపములను
'అపుడు—అపు' డంచు నాతోడ జపము సల్పు,
నాపయిం బ్రేమ పదముల నంటవచ్చు
విఫలవాంఛాత్రపాభరవివశయగుచు.

* * * *

కనులనీరొల్క లోలోన కనలిపోయి
దీర్ఘహృదయపటంబును దేలవైచి
సహజలావణ్యరూపవిషాదకలిత
కుముదవదనంబుతో వ్రాలి క్రుంగిపోవు.

* * * *

దినము నవ్వేళ కచ్చట జనుచునుండి
నా శిథిలవీణ నామెకు బాడనిచ్చి
నాదుప్రియురాలు-మణిపాయ-నాదతరగ (?)
డోలికల నోలలాడుచు సోలిపోదు.

* * * *

ఆనిశీథుల మణిపాయ నేను కలసి
గాఢపరిరంభణంబునం గలలు గనుచు
ప్రేమరాజ్యవిహారముల్ వెదలుచుండి
యాలో నిద్దుర మేల్కొందు మకట! విధిని.

* * * *

మా సుఖము చూడలేనట్టి మాయ యింద్ర
సవతిపోరుగం దోచె మా జక్కవలకు
ఓర్వలేనట్టి సవతి నా యువిద నిట్టె
పట్టుకొనిపోయి సంద్రాన పాఱవైచె.

* * * *

ఇప్పటికిగూడ నచ్చోటి కేగినపుడు
నాహృదయరాజ్యలక్ష్మి నినాదసాధు
పూతసంగీత మొక్కింత పోల్చుకొనుచు
కనుల నశ్రులు రాల్చక కదలలేను.

---

# వేడుకోలు

వెలువోలు సీతారామయ్యచౌదరి

దివ్యమై నిత్యమగుచును దేజరిలెడు
నీయనంతశక్తి మదీయనేత్రయుగళ
మునకు సాక్షాత్కరించుత ననవరతము
భవ్యభవదీయసుస్వరూపంపుఛాయ
మద్హృదయమున ననుభూతమయి నెగడుత
మధురమగు నీసునామము మామకీన
గానము, శ్రుతి, గురుమంత్రము నయి నిలుత
తావకీనధ్యానంబె మద్ధర్మమును సు
కర్మమును బురుషార్థమై క్రాలుగాత
యుష్మదీయవిజ్ఞానసుజ్యోతికలన
మద్హృదిని దీప్తి బ్రసరించి మనుత సతము
నమలమైయొప్ప మీ ప్రణయంబు నాకు
నాత్మధారకు ప్రాణాధారమయి వెలయుత
నాథ! మీదు సౌందర్యమున ననుగుణము
గను మదీయజీవనము సౌఖ్యములం గాంచి
సత్యశాంతశివంబుల సరళశుద్ధ
సుస్వరూపంబగుచు వెల్గుచుండుగాత.

# మఱదీ! లక్ష్మణ! నిన్ను నే మఱవఁగలనె?

గున్నేపల్లి అక్కులింగము

(గీతములు)

సిరుల నెడఁబాసి 'పితృసమో జ్యేష్ఠ' యనెడి
పెద్దల మృదూక్తిఁ దలఁదాల్చి ప్రేమమీఱ
ఘోర వనవాసమునను బాల్గొంటి వౌర!
మఱది! నీదు సౌభ్రాత్రమ్ము మఱవఁగలనె?

సర్వవిధముల నంగరక్షకునిభోలెఁ
దండకారణ్యభూముల నిండుభక్తి
గొలిచి నగరసౌఖ్యోన్నతిఁ గూర్చినావు!
మఱది! నీదు సేవాసక్తి మఱవఁగలనె?

శ్రమదలంపక నాఁడు నీసంతరించు
నాటవికవస్తువైభవ మ్మలర నవుర!
పర్ణశాలసైతము దివ్యభవన మయ్యె
మఱది! నీకౌశలపుఁబెంపు మఱవఁగలనె?

రమణగొల్పెడి పూవుటీరములఁ జొచ్చి
పరిమళము నివ్వటిలిన క్రొవ్విరులఁ దెచ్చి
ప్రియముపాటిల్ల నాకు నర్పించినావు
మఱది! నీయాదరపుఁగల్మి మఱవఁగలనె?

అరసి తెచ్చిన వన్యఫలాళియందు
నీయనేర్చితి నాకెంతొ యిష్టమనుచు
దోరపండుల నెంచి తోడ్తో నయారె!
మఱది! నీయింగితజ్ఞత మఱవఁగలనె?

అకట! నిను బేలనై తూలనాడునపుడు
నాదు కఠినోక్తులకు నెంత నవసినావొ?
యించుకేనియుఁ గినుక వహింపవైతి
మఱది! నీశాంతభావమ్ము మఱవఁగలనె?

కడకుఁ జేదోడువాదోడుగా మెలంగి
గహనమునఁ బట్టణమ్మున గౌరవమున
నీప్సితార్థమ్ములనుగూర్చి యొసఁగినావు
మఱది! నీ సద్గుణోన్నతి మఱవఁగలనె?

నెమ్మిమై మఱఁదులు వధూనికలఁ గాంచి
గౌరవింతురుగాత నీకరణి నెపుడు
నవని నీవృత్త మాదర్శమగునుగాత!
మఱఁది! లక్ష్మణ! నిన్ను నే మఱవఁగలనె?

---

# పాండువంశ ప్రతిష్ఠ

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

(నా యాంధ్రభవిష్యపర్వము లోనిది)

జనమేజయభూవరసం - దనులం దెవ్వాఁడు పాండునందనకులవ
ర్ధనుఁడయ్యె? సర్పయాగం-బున కవ్వల నెవ్వఁ డేమి పొనరిచెఁ జెపుమా!

అనఁగన్ సూతసుతుండు వారి పరమాహ్లాదంబు నీక్షించి యి
ట్లను నాకవ్వడి పౌత్రజుండు కనెఁ గాశ్యాదేవియందున్ యశో
ధనుఁడై యన్వయవర్ధనుండయిన చంద్రాపీడుఁడున్ బ్రహ్మవి
ద్యను బూర్ణుండయి యాత్మవేత్తయగు సూర్యాపీడుఁ డన్పుత్రులన్.

కలిగిరి చంద్రాపీడున - కలఘులు నూర్వురు కుమారు లన్వయకరులై
వెలసిన వారలఁ దొలివాఁ - డిల నేలెను సత్యకర్ణుఁ డిభపురపతియై.

వారాణసపురపతి యా - శూరాగ్రణి యఖిలరాజ్యసుఖముల గనియున్
బేరొందియాగవిధులన్ - జేరెను సతిఁగూడి తపము చేయఁగ వనమున్.

ఆనరనాథసూనుఁడు మహాహవవీరుఁడు శ్వేతకర్ణభూ
జాని యదూద్వహుండగు సుచారుని పుత్రిని మానినీమణిన్
మానినిఁ బెండ్లియై మనుజమానితుఁడై భువి నేలియేలి సం
తానము లేమి నేలుబడిఁ దద్దయు రోఁత జనించినంతటన్.

ధరణిరాజ్యంబు మంత్రులపరము చేసి - యెల్లభోగంబులను మది కెడము చేసి
నీడవలెఁ దోడవచ్చు మానినియుఁ దాను - భక్తిమార్గంబునం దపోవనము చొచ్చె.

వనగతుఁడైన యాతఁ డతిభక్తి మహేశసపర్య, లామె య
జ్జనపతిపాదపద్మపరిచర్యలుఁ జేయుచు నుండునంత య
య్యనుపమశీల మానినికి నయ్యెను గర్భము దైవయుక్తి నం
తన నవమాసముల్ గడచెఁ దత్సమయంబున శ్వేతకర్ణుఁడున్.

మానసమతి వైరాగ్యము - పూనఁగ నిజవంశపూర్వపురుషుల త్రోవన్
మానితమైన మహాప్ర - స్థానము చేయంగఁ దలఁచి చయ్యనఁ గదలెన్.

తనగతి చూడ కట్లు మమతారహితాత్మత నేగుచున్న భ
ర్తను వెడఁబాయనోపక భరంబగు గర్భముతోన యాతనిన్
వెనుకొని మానినీసతి వనిన్ గిరికుంజమునందు గాంచి పు
త్రుని విడనాడి పాండవులతోఁ జను ద్రోవది కైవడిం జనెన్.

పతిభక్తిపేర్మి నపత్యమోహంబును విడనాడి తనతల్లి వెడలినంత
నెండ తాఁకునఁ గంది యేడ్చు నక్కసుగందు గతి కచేతనములుఁ గరఁగెననఁగ
నంబుదంబులు నీడ నతనిపైఁ బట్టెపెడిసమయమం దాదారిఁ జనుచునున్న
శాంతచిత్తులు శ్రవిష్టాపుత్రులగు పిప్పలాదుండు కౌశికుఁ డనెడివారు

కూర్మి నబ్బాలుఁ గొనిపోయి కొండకాల్వ - బండపై నిడి కడుగుచు నుండ వాని
ప్రక్క లారాతిరాపిడిఁ బొక్కి యల్ల - నల్లవాత్క్రమంబుగ నల్లవాటె.
అప్పు డజపార్శ్వముల యట్టు లతనిప్రక్క - లెసఁగ నజపార్శ్వుఁడను నామ మిడి యతనిని
వారు గొనిపోయి వేమకవనిత కిచ్చి - రామెయును బెంచె నాత్మజప్రేమ నంత.

వేమకిపుత్రుఁడై పెరిఁగి పెద్దయి యాతఁడు, కానఁ దన్ను ము
న్నోమినవారు మంత్రులుగ నున్న తపూరుకులక్రమాగత
శ్రీమహితాత్ముఁడై గుణగరిష్ఠత భూతల మేలెఁ దన్మహా
థామునివంశ మాతన్నిప్రధానుఁ వంశము నిండి నెల్లెడన్.

పాండువంశప్రతిష్ఠ యిట్లుండెఁ గాక - పౌరవాన్వయనిష్ఠ నుపన్యసించి
పద్యమొకటి యయాతి చెప్పండె తొల్లి - దానిఁ జదివెద వినుఁడు మేధావులార !

శ్లో. అచంద్రార్కగ్రహా భూమి - ర్భవేదపి న సంశయః
అపౌరవా న తు మహీ - భవిష్యతి కదాచన.

